## మా మాట

ఇది 'అమరసాహితి' ప్రచురణ సంస్థ అందిస్తున్న తొలి పుష్పం. త్వరలో వెలువడనున్న మరో కావ్యం స్వర్ణధూళి. తొలిసారిగా ఉత్తమ గేయ సంపుటితో ఒక యువకవిని పరిచయం చేస్తున్నందుకు 'అమరసాహితి' గర్విస్తున్నది.

కవితలే కాక కథాసంపుటాలు, నవలలు ఇత్యాదులు క్రమంగా ప్రచురించే ప్రయత్నాల్లో ఉన్నాము. రచయితల హృదయపూర్వక సహకారం సర్వదా లభిస్తుందని మా గాఢ విశ్వాసం.

ఉత్తమ సాహిత్యాన్ని అందించే సంకల్పంతో నెలకొల్పిన 'అమర సాహితి' అశేష పాఠకుల ఆదరాభిమానాలను చూరగొం టుందనీ, మా కృషి ఫలప్రదమౌతుందనీ ఆశిస్తున్నాము.

అమరసాహితి
హైదరాబాదు
26-1-64

ప్రకాశకులు

ఈ గీతాలను తొలిసారి ప్రచురించి సహకరించిన యువ, ఆంధ్రప్రదేశ్, ప్రభ, పత్రిక, సాధన, స్రవంతి, చుక్కాని, మయూరి పత్రికా సంపాదకులకు నా హార్దిక కృతజ్ఞతలు.

— రచయిత

# కవితాంజలి

చీకటి మూలల ఎదిగీ ఎదగని
చిన్ని గులాబిని—అలనాడు
పలుకరించినవి పవన వీచికలు
జిలిబిలి వెన్నెల కిరణాలు—

ఆ కిరణాలే మేలు కొల్పినవి
ఈ కవితార్ద్రము భావికి
ఈ నా తొలి సురభిళ గీతాంజలి
శ్రీ నార్ల చిరంజీవికి—



"దిక్సూచిని వీడినాను దిశలు కాన రాక
చుక్కానిని విడచినాను తీర మొకటి లేక
హోరుగాలి...జోరు వాన...ఘోరుమనే కడలి
సాగనిమ్ము స్వేచ్ఛాగతి ఈ జీవన నౌక"

# అశ్రుగీతి

నును రేకులు విప్పకనే
చిరునవ్వులు చిందకనే
నిశీథిలో వర్షించిన
నిబిడ హిమానీ వృష్టికి
మరణించిన విరి కోసం...

ఏగిరినో జన్మనెత్తి
తరగలెత్తి పరుగులెత్తి
అగాధాల క్రుంగి, గ్రీష్మ
తాప జ్వాలలకు మరగి
ఆవిరైన ఝరి కోసం...

అంతెరుగని ఎడారిలో
నిరాశలో పిపాసతో
కనులు వ్రాలి తనువు తూలి
నడిదారిని పడిపోయిన
ఒంటరి తెరువరి కోసం...



6

# కొడిగట్టే దివ్వెలు

ఈ కొడిగట్టే దివ్వెల
లో కనిపించే దేమిటి ?
ఈ కొన ఊపిరితో జీ
వులు వినిపించే దేమిటి ?

ఇదేమిటీ జగతి కనుల
సంశయ జీమూతావృతి
పెంజీకటి పేరుకున్న
భీతావహ వాతావృతి—

ఎన్నెన్ని యుగాల నుండి
మానవశక్తులను పిండి
వెలిగించిన పీ దివ్వెలు !
కలిగించిన పీ దీప్తులు ! !

ఈ చీకట్లను చీల్చే
కాంతి ధార కురియాలని
జగత్సరసిలోన శాంతి
శతపత్రం విరియాలని

దివ్య పరిమళాలతోటి
దిగంతాలు నిండాలని
ఎన్ని ఆశ లెన్ని కలలు !
విరబూసిన వెన్ని కళలు ! !

అన్ని దివ్వెల చుట్టు ప
రిభ్రమించి రొదలు చేసి
రెక్కలు కాలిన పుర్వుల
వోలె సురిగిపోతున్నవి

ఏదో ఒక అజ్ఞాత మ
హాశక్తి నటిస్తున్నది.
ఈ మానవ శక్తులపై
విజయం ప్రకటిస్తున్నది

ఏ కనిపించని జంఝా
ప్రభంజనం వీస్తోందో
దీన హీన గళాలెత్తి
దివ్వెలు విలపిస్తున్నవి.

ముసిరే చీకట్లలోన
మునిగే అనాథ లోకపు
మోయలేని మూగ వెతల
మూల్గులు వినిపిస్తున్నవి



8

# హిందోల గీతి

విరిసీ విరియని ఉషస్సు
వీడీ వీడని తమస్సు
ఆశ నిరాశల మధ్య
బ్రతుకే శాశ్వత సంధ్య

*          *

అందని తమికై ద్యోమణి
పొందని రవికై పద్మిని
యుగయుగాల అన్వేషణ
ముగియని నిష్ఫల కామన

*          *

దీపకాంతికై పరుగులు
తీసే కోర్కెల పురుగులు
మరణించుటె పరమావధి
చర్విత చర్వణమే అది

*          *

అవిరామ స్పందనతో
అజ్ఞేయాక్రందనతో
సదా తరంగాల రవళి
బ్రతుకే కడలేని కడలి

*          *

## 9

సుఖాలతో బాధలతో
గాథలతో బోధలతో
మానవ జీవన రూపం
చిత్ర వర్ణ హరి చాపం

* *

ఈ హృద్గీతీ భావం
విశ్వ విపంచీ రావం
ఇది యుగ సంధ్యాకాలం
ఇది ముగియని హిందోలం—



# నవగీతం

గీతం రాయాలి నేను నవగీతం !

కరగిపోవు కలల పరిమళాలలో
చెదరిపోవు కర్బుర కిరణాలలో
వినిపించని వేదనా స్వరాలతో
మేళవించి హృదయ రుధిర సంగీతం
గీతం రాయాలి నేను నవగీతం !

తటిల్లతా తంత్రులు రవళింపగ
వెలుగుపూలు దిగంతాల పూయగ
నభోవీధిలో కృష్ణ విపంచియై
కదలిపోవు ప్రావృషేణ్య జీమూతం
గీతం రాయాలి నేను నవగీతం !

హేమంత నిశీధు లావరింపగ
బ్రదుకులే సమాధులై శయింపగ
అర్థరహిత మైన విశ్వ సృష్టిలో
పొంగి పొరలు దుఃఖబాష్ప జలపాతం
గీతం రాయాలి నేను నవగీతం !

భీషణ ఝంఝానిలమే రేగిన
దారుణ దావానలమే మూగిన
దగ్ధ జీవితోద్యాన వనాలలో
తంద్రాలస నీరవ రసోద్భూతం
గీతం రాయాలి నేను నవగీతం !

## 11

తిమిర కాంతి ధారలు వర్షించిన
హాలాహల పీయూషము లూరిన
ఈ జీవన భాండమే మథింపగ
ఉద్భవించు మృదుల మధుర నవనీతం
గీతం రాయాలి నేను నవగీతం !

తుషారాశ్రు చారు మౌక్తికాలతో
వ్యథాహృదయ మధుర మరందాలతో
కుహూ రాత్రి రవికెత్తు నివాళియై
వికసించు సహస్ర పత్ర జలజాతం
గీతం రాయాలి నేను నవగీతం !



# ఛాయారూపిణి

నిబిడ నిశ్శబ్ద రజనీ గర్భగోళాన
నీ అర్థహీన సంగీతమే వినిపించు
నా మృదుల హృదయ వీణాతంత్రి స్పందించి
నిన్నే అనుకరించు నీకై కలవరించు—

నా అశ్రుసిక్త నయనాంతరభిషిక్తవై
నా హృదయరక్తపానై కానురక్తవై
అణువణువులో నిల్చి క్షణక్షణములో పిల్చి
కలచిపోయెద వేల! కరగిపోయెద వేల!

నాలోని ఆశవై నాలో నిరాశవై
నను విడని శ్వాసవై నాలో పిపాసవై
నిఖిలమున నీవు పూర్ణీభవించెద వేల!
నను నీడవోలె వెన్నంటి వచ్చెద వేల!

విధికి తలవంచి జీవించు ప్రాణి విధాన
ఋతుగమనమును అనుసరించు తరువు విధాన
ఎందుకో ఏడ్చితిని! ఎందుకో నవ్వితిని
అర్థమే లేని చిర యాత్రలో అలసితిని

పికములన్నీ దాచిపెట్టిన అపశ్రుతులు
పలుకందుకోలేని పైశాచిక స్మృతులు
ఏకమై గీతమై ఎగసె నీ రేయి నా.
అధరాలు దాటి ధారాధరాలను దాటి

అగ్ని రుధిర ప్రవాహము భరింపగలేక
అంతమే లేని దాహము సహింపగలేక
గద్గద గళమ్ముతో కంపిత కరాలతో
కదలి వచ్చితి నేడు కడకు నీ సన్నిధికి

నీ రహస్యపు మేని నీలి ముసుగును తీసి
నీ వెవరవో చూడనివ్వు—
ఈ పిశాచాకృతికి ఏ అర్థమున్నదో
ఇపుడైన తెలిసికో నివ్వు—



14

# అశ్రు దీపిక

ప్రతి ప్రభాతం కత్తిపోటే పొడువగ
దారి పొడుగున గుండెనెత్తుటి మడుగులు
ప్రతి నిశీథం పాముకాటే వేయగ
దిక్కులదిరే లేత గుండెల మూల్గులు

జ్వలిస్తున్నది గుండెలో దావానలం
స్రవిస్తున్నది గొంతులో హాలాహలం
ఎడతెగక మార్మోగు నాలో భయదమై
నిదుర నెరుగని నీరధుల కోలాహలం

పిచ్చి ఎడదా ఎందుకే రోదింతువు
ఈ వ్యధార్థ్యము నీవు కోరినదేకద !
దీపకాంతిని కోరి పరుగిడు శలభము
బాధలో కడతేర్చుకొను జీవిత కథ

స్వచ్ఛ సుందరమైన జీవన సరసిలో
విచ్చుకున్నది వేదనా శతపత్రము
స్వీకరింపుము ప్రేమ పూర్ణకరాలతో
అదే నీకు ప్రసాదితామృత పాత్రము

కాళరాత్రిగ మారిపోయెను కాలము
భూత ధాత్రిగ మారిపోయెను లోకము
రాలినవి నక్షత్రములు మసి బొగ్గులై
మాసిపోయెను మలినమై శశి బింబము

భయద రాక్షసి రూపమెత్తెను రోదసి
కాల జలధర కేశములు విప్పార్చుక;
ఆశతో నునురెప్ప లెత్తిన కన్నులు
వ్రాలిపోయెను లేదు కాంతి మరీచిక

దాహతప్తములైన కన్నుల ముందర
నిల్చినది మరుభూమియై భవితవ్యము
విరిసి విరియని లేగులాబీ మొగ్గపై
పౌషరజనీ నిబిడ హిమికా పాతము

మరువజాలని మాసిపోవని గుర్తుగ
భూత జీవన లతిక పూసిన పూవుగ
శూన్య నీరవ శిథిల హృదయాంగణమున
మిగిలె నొక్క వ్యథాశ్రుదీపిక తోడుగ

కాల ఝంఝా ప్రభంజన వీచికలలో
ఆరునేమో అశ్రుదీపిక దారిలో
గమ్య మెరుగని దీ ప్రయాణము తెరువరీ!
పెనుతుఫానులు రేగు ఇసుక ఎడారిలో



# కుహూ ....

ఇరుల కురులను విప్పుకొని వచ్చి
ఈ రేయి నన్ను భయపెడుతుంది
పడగ విప్పిన కాలసర్పమై
పగ బట్టినట్లు బుస కొడుతుంది

స్మృతిగర్భమే అగ్ని కుండమై
చిమ్ము నాపై విస్ఫులింగాలు
కాలమే కాకోల భాండమై
కదలు నాపై—విషతరంగాలు

ఏ గత స్మృతులనో త్రవ్వుకొని
ఏడ్చే పిశాచాల కన్నీళ్లు
ఏ మహా గాథాలలోనో—మూ
ల్గే నిశాచరుల నిట్టూరుపులు

నానా వికార నాదా లెగసి
ఈ నిశీథి గళాన సుడి తిరుగు
ఈ విభావరి గర్భ కుహరాన
ప్రేవులే కలతపడి మెలి తిరుగు

ఏవో పరాజయపు పాచికలు
అవమాన పవమాన వీచికలు
సందేహ పుష్కలా వర్తాలు
సాధ్వసంకర తృణా వర్తాలు

నను చూచి ఎందుకో జాలిగా
నవ్వినవి నా జాగ్రదస్థికలు
భుగభుగల హృదయాగ్ని శిఖలలో
బూదియై పోయినవి కోరికలు

ఇరుల కురులను విప్పుకొని వచ్చి
ఈ రేయి నన్ను భయపెడుతుంది
పడగ విప్పిన కాలసర్పమై
పగ బట్టినట్లు బుస కొడుతుంది



# ఎందుకు?

వాడిపోయిన ప్రసూనానికి
వసంతాల ప్రసక్తి దేనికి?
ఇంకిపోయిన ఝరీకన్యకు
వలపు మలుపుల తలపు దేనికి?

మునిగిపోయిన భగ్న నౌకకు
తీర మెందుకు? దూర మెందుకు?
మూగ వోయిన శిథిల వీణకు
రాగ భావ విచార మెందుకు?



# అరగంట క్రితం

అరగంట క్రితం ఆకాశం ఎంత నీలంగా వుంది!
అప్పుడే మేఘసంఛన్నమై పోయింది!
అశనిపాతాలతో
ఫెళ ఫెళార్భటులతో
ప్రళయ భీకర రూపమెత్తి గర్జిస్తోంది—

అరగంట క్రితం ఈ సాగరం ఎంత నిశ్శబ్దంగా వుంది!
అప్పుడే పోటెత్తి హోరెత్తి పోయింది!
ఉత్తుంగ భంగాల
నాలుకలు సాచుకుని
ఉర్వినే కబళించునట్లు గాండ్రిస్తోంది—

అరగంట క్రితం అతని ముఖం ఎంత ప్రశాంతంగా వుంది!
అపుడే వివర్ణమై వికృతమై పోయింది!
ఏ ఇసుక తుఫానులు రేగెనో మనసులో
ఏ మరణ వాద్యాలు మ్రోగెనో ఎడదలో
ఆపాదమస్తకం మేను కంపిస్తోంది ...



## ౨౦

# ఇసుక ఎడారి

పరుగెత్తలే విచట అరబీ తురంగాలు
విహరింపలే విచట స్వేచ్ఛాకురంగాలు
కదలిపోలేవు గాంభీర్య దీప్తులెసంగ
మందగమనాలతో మత్త మాతంగాలు

కాలమొక తుదిమొదలు లేని ఇసుక ఎడారి
ఇది పొడుగు కాళ్లున్న గూని ఒంటెలదారి
నీరసించిన నిరాశా పథిక సోదరా!
లోకమిది కొందరికి మాత్రమే రహదారి...



# ద్వంద్వాతీతం

పక్షాలు విప్పుకొని పంజరాలెత్తుకుని
ఎచటికో ఎగిరిపోతున్నాయి విహగాలు
కళ్లాలు త్రెంచుకొని రౌతులను వంచుకుని
ఎక్కడెక్కడో త్రిప్పుతున్నాయి గుర్రాలు

మానవుని చేజారి పారదంలా పారి
పోతున్నది మనస్సు
పరుగెత్తి వేసారి విసుగెత్తి దిగజారి
పోతున్నాడు మానవుడు

లోకానికి వృద్ధాప్యమ్
లోకానికి చత్త్వారమ్
వెలుగుకాని, చీకటికాని వింతకాంతి
నిమ్నోన్నతాలు తెలియని నీలికాంతి

శాంతి కాని శాంతి జల్లు కురుస్తోంది
మమత లేని సమత వెల్లి విరుస్తోంది
సుఖ దుఃఖాలు వసంతలాడు కుంటున్నాయి
న్యాయ న్యాయాలు క్షీర నీరాలు —.

సత్యా సత్యాలు ప్రేమించుకుని
అద్వైతగీతాలు ఆలపిస్తున్నాయి
అందమైన అవ్యక్తమైన
కాంతి ముసుగు కప్పుకుంది
అందరూ చెప్పేవి నీతులే!
అందరూ ఆషాఢ భూతులే!

యుగయుగాలుగా మధించిన
మానవ మేదస్సులో ఆవిర్భవించిన
హాలాహలం పీయూషం ఏకమైనవేళ
దానవత్వం రోసి, మానవత్వం మాసి
దైవత్వ మందుకోలేక
పైశాచికాకృతి వహించెనా నేటిమానవుడు!



# వృక్ష వర్షీయసి

ఏ నాటిదో వృక్షమొకటి
ఏ కాకిగ నిల్చున్నది
కటిక రేయి లోన మంచు
కన్నీళ్లోడుస్తున్నది.

ఎప్పుడు పుట్టిందో అది!
ఎందుకు పుట్టిందో అది!
ఏమీ తెలియదు దానికి
పిచ్చిదానిలా వున్నది.

కదల్లేదు మెదల్లేదు
ఆజన్మాంతం బంధీ;
పలుకలేదు పెదవి విప్పి
ప్రాణ స్పందనం వుంది

చిగుళ్ళెత్తి పూవులతో
పిందెలతో హసిస్తుంది;
సర్వస్వము కోల్పోయి ది
గంబరియై నిలుస్తుంది.

తాపాలను వర్షాలను
తలవంచక సహిస్తుంది
ఋతు షట్కపు శాసనాన్ని
గతి తప్పక వహిస్తుంది.

ఆ మనికీ శిశిరానికి
అర్థం తెలియదు దానికి
మోదానికి ఖేదానికి
భేదం తెలియదు దానికి.

తన నీడల విశ్రమించు
నరులు తనను ఖండిస్తే
ఎగిరే పిట్టలు తననే
వెక్కిరించి వెళిపోతే

ఏమీ అనుకోదు తాను
ఏమీ అనలేదు తాను
ఎపుడో నేల కూల్చివేయు
ఏదో ఒక పెనుతుఫాను.

ఏ అర్థం ఎరుగని ఈ
సృష్టికి అది బలియైనది
ఏ ఆత్మీయత కలిపెనో
నా కది నెచ్చెలి యైనది.



# ప్రాక్పశ్చిమాలు

రాలేవు నా కుటీరము దాకనీవు
నీ దేహళిని చేరనే లేను నేను —

అందుకోలేని శిఖరాగ్రాన నీవు
క్రుంగిపోయిన ఇరుల కూపాన నేను
స్నేహ సేతువు నెట్లు నిర్మింపగలము!
రాగవల్లరి నెట్లు ప్రాకింప గలము!

మెరపు నవ్వుల జలంధర మూర్తివీవు
మరుభూమి దప్పిగొను తెరువరిని నేను
రాలేవు నా కుటీరము దాక నీవు
నీ దేహళిని చేరనే లేను నేను —

ఉదయవేళా ప్రాచి రుజ్వలాంగినివి
అపరసంధ్యా పశ్చిమాకృతిని నేను
మన సమాగమ మసంభవమైన గాని
ఈ దివ్వెలారునా! ఏ నాటికేని

తారాపథాన అమృతాంశు రేఖికవు
నీ కైరపించు వెన్నెల పుల్గునేను
రాలేవు నా కుటీరము దాక నీవు
నీ దేహళిని చేరనే లేను నేను —

ఈ వియోగాంభోధి ఇరుదరుల పైన
ఈ సమాంతర యాత్ర ఎన్ని జన్మాలు!
శుష్క హస్తాలలో శూన్య పాత్రికల
నిండిపోయినవి కన్నీటి బిందువులు

అంది అందని మధురసాకృతివి నీవు
జన్మ జన్మాల ప్రణయోన్మాది నేను
రాలేవు నా కుటీరము దాక నీవు
నీ దేహళిని చేరనే లేను నేను

వెలుగు చీకటులు దారులు రెంటియందు
పరచు కున్నది ఇరుల బాట మన ముందు
అవని గగనా లేకమై కలియుచోట
వినిపించు నేమొ తీయని వలపు పాట

రాలేవు నా కుటీరము దాక నీవు
నీ దేహళిని చేరనే లేను నేను—



# గీతి.

తలుపు తట్టి వెళిపోతున్నా వెందుకు?

ఇరులు కురులు విప్పుకున్న
ఏ కాంత కుటీర వాటి
నిదుర వోవు కన్నుల చాం
ద్రీ కిరణము వలె స్పృశించి
మేలు కొల్పి వెళిపోతున్నా వెందుకు?

నిరీక్షణా విలీనమై
నిరాశా పరీవృతమై
గాన ఝురులు నిదురించిన
మౌన హృదయ విపంచికా
తంత్రి మీటి వెళిపోతున్నా వెందుకు?

కదలలేని కరుగలేని
కారుమబ్బు గుండియలో
శంపాలత వోలె మెరసి
క్షణ ప్రభా దీప్తి నించి
విదారించి వెళిపోతున్నా వెందుకు?

నిశ్శబ్దత పేరుకున్న
నిర్జీవ సమాధి లోన
చైతన్య ప్రదమృదు సం
గీత లహరి వోలెసోకి
కరగి మాయమై పోతున్నా వెందుకు?

ఎదురు చూచు రక్తాక్షుల
కికలేదా సుఖ సుషుప్తి
ఈ సంధ్యా జీవితమున
కేనాటికి పరిసమాప్తి
తలుపు తట్టి వెళిపోతున్నా వెందుకు?



# ఉగాది మజిలీ

ఈ అనంత కాల యాత్ర
లో ఉగాది మైలురాళ్లు
ఎన్నిదాటి వచ్చితినో...
ఏ దిశలో గమింతునో...

ఎన్నిసార్లు రిక్తమైన
ఈ జీవన పాత్రికలో
నవజీవం నింపితినో...
నవాశ లూరించితినో...

ఎన్నిసార్లు క్రుద్ధ ప్రకృతి
ఏకాకిని బెదిరిస్తే
ఎదిరినిల్చి పోరితినో
విధినే శాసించితినో...

ఏ మైనను ముగియబోని
దీ విచిత్ర కాలయాత్ర
ఏ నాటికి పగిలి పోని
దీ జీవన వజ్ర పాత్ర



# కలవరింత

ఒక్క మబ్బు తునుక కొరకు
శూన్య నభో వీధులలో
వెదకి వెదకి వేసరిలితి
దాహతప్త చాతకినై...

నన్ను చూచి నవ్వినాయి
సంద్రాలు నదీనదాలు
నన్ను పరిహాసించినాయి
బురద నోటితో హ్రదాలు

*          *          *

ఏ స్నేహ స్పర్శలేక
ఏకాంత ప్రతీక్షణలో
కుమిలితి శిథిలాలయాన
కొడిగట్టిన దీపికనై

నిశీథాలు వేన వేలు
నిరీక్షలో గడచి పోయె
పొగలు సెగలు ఎగజిమ్ముచు
పగళ్లన్ని రగిలిపోయె

*          *          *

కలల కల్లు తప్పత్రాగి
కలవరించితిని మత్తిలి
నిరాశలో...నిస్పృహలో...
నిబిడాంధ తమోగుహలో...

కలగి పోతి కరగి పోతి
కడకు నేల కోరగిపోతి
భావ హీన గీతికనై...
స్వర హీన విపంచికనై...



32

# గడ్డి పూలు

రాగమయ కిర్మీర కాంతుల
రంగ వల్లుల శోభ లీనుచు
విశ్వకవి లేఖిని లిఖించిన
విమల కవితాక్షరములో యన

ఈ ప్రభాతాంగణములో విక
సించునీ చిరుగడ్డి పూవులు
హాయిమై చిరునవ్వులొలికెడు
తీయ తీయదనాల ప్రోవులు

చింత వంత లొకింతలేని ప్ర
శాంత నిర్మల జీవితమ్ముల
స్వచ్ఛ దర హాసాలనే వెద
జల్లగల నిష్కామ జీవులు

అల్పకాల వ్యవధి లోపల
ఆరిపోయిన నేమి బ్రదుకులు!
సృష్టి సౌందర్య ప్రభల వె
ల్గింప ఆత్మార్పణ మొనర్తురు

నావలెనె భూనందనోద్యా
న వాటికలో కనులు విప్పిన
అనుగు నెచ్చెలులార! మీరలు
అమర సందేశాక్షరమ్ములు!

ఏదియొ మీ గుస గుసలలో విని
పించు విశ్వరహస్య తత్త్వము
పురిని విప్పు నిదేలో చంద్రకి
వోలె నాలో మానవత్వము—



# వి ధి

శ్రావణ మేఘం రాల్చిన
జల కణాలు రెండు...
శుక్తిగర్భమున పడినది మౌక్తికమై రహించింది
మట్టి గుంటలో పడినది మాలిన్యం వహించింది
భూషించే రొకదానిని— ద్వేషించే రొకదానిని
శ్రావణ మేఘం రాల్చిన
జల కణాలు రెండు...

ఒక సుందర విభాతాన
వికసించిన విరులు రెండు...
పరమేశుని పద సన్నిధి ప్రాప్తించిన దొక్క విరికి
చితికి ధూళిలో నశించు గతి పట్టిన దొక్క విరికి
పరమపూజ్యమైన దొకటి— పరిత్యాజ్యమైన దొకటి
ఒక సుందర విభాతాన
వికసించిన విరులు రెండు...

చిన్ననాటి మరపురాని
స్నేహితు లున్నారిద్దరు...
నిండిన మధు పాత్రికతో నింగి కెగసి పోయె నొకడు
నెత్తురులను క్రక్కుకొనుచు నేల కొరిగి పోయె నొకడు
భూషించే రొక మిత్రుని—దూషించే రొక మిత్రుని—
చిన్ననాటి మరపురాని
స్నేహితులే ఇద్దరు...

('సాహిర్' గీతం)



# అశ్రుగంగ

స్వేచ్ఛగా హృదయాన్ని రోదించనీ...
కన్నీరు వరదలై ప్రవహించనీ...

ఆ పవిత్రామర ధునీ తరంగాలలో
కలుష హృదయాన్ని అభిషేకించనీ...

ప్రవహించలేని అశ్రుకణాలు
గుండెను దహించు అగ్నికణాలు

మనసు మాటలు వినకు ఏ నాటికి!
కట్ట వేయకు సుమీ కన్నీటికి.

స్వేచ్ఛగా హృదయాన్ని రోదించనీ...
కన్నీరు కాల్వలై ప్రవహించనీ..



౩౬

# దాహం! దాహం!

దాహం దాహం దాహం దాహం
ఆరని దాహం తీరని దాహం
గిరులకు దాహం తరులకు దాహం
గ్రామాలకు నగరాలకు దాహం
దేశాలకు దేశాలకు దాహం
విశ్వాంతర గోళాలకు దాహం

దాహం దాహం దాహం దాహం
ఆరని దాహం తీరని దాహం
కత్తికి దాహం శక్తికి దాహం
ముక్తిని కోరే భక్తికి దాహం
త్యాగికి దాహం భోగికి దాహం
ఆశలేని బైరాగికి దాహం

దాహం దాహం దాహం దాహం
అరని దాహం తీరని దాహం
రాళ్లకు దాహం గుళ్లకు దాహం
వరాలిచ్చు దేవుళ్లకు దాహం
తంత్రాలకు యంత్రాలకు దాహం
కనిపించని భూతాలకు దాహం

దాహం దాహం దాహం దాహం
ఆరని దాహం తీరని దాహం
మంటికి దాహం మింటికి దాహం
పడుచుదాని క్రీగంటికి దాహం
బీటికి స్మశాన వాటికి దాహం
భగ్నజీవి కన్నీటికి దాహం

దాహం దాహం దాహం దాహం
ఆరని దాహం తీరని దాహం
అజ్ఞానికి విజ్ఞానికి దాహం
ఏమీ తెలియని పాపకు దాహం
ఏటికి దాహం నీటికి దాహం
నీటిలోని చిరు చేపకు దాహం

దాహం దాహం దాహం దాహం
ఆరని దాహం తీరని దాహం
కురిసిన వర్షాలేమై పోయెను
ఈ భూగోళము బీటలు వారును
వెలిగిన దీపాలేమై పోయెను
అంధ తమస్సే పాటలు పాడును

జల ప్రళయమే ప్రగల్భించినా
ఆరని దాహం తీరని దాహం



# మంచు కన్నీటి జడులలో....

మంచు కన్నీటి జడులలో మౌనరాత్రి
శూన్య గర్భాన అగ్నివీచులు శయించె
అర్థ రహిత ప్రశాంతత ఆవహించి
నిదుర మునిగెను క్షుభిత వార్నిధులు కూడ!

అంధకారాన అశ్రుదీపాళి నిలిపి
వెలుగు బాధాస్మృతుల వీచికల లోన
హృదయ సరసి అగాధాల ఈదులాడి
నిదుర నెరుగని కనులతో వెదకికొందు
వేటికోయి ఉన్మాది!......

నిస్తరంగ కాసారము నిటుకలంచి
కొని జలావర్తములు రేపు కొందువేల
ఈ ప్రశాంతత నీవు సహింపలేవా!
ఈ వివిక్తము నీవు భరింపలేవా!!

ఇట క్షుధాత ప్తమై చరియించు విఫల
కామనలు నాగులై రేగి కాటువేయు
ఇచట కఠినోపలాలే స్పృశించు నిన్ను
ఇచట కంటకాలే పల్కరించు నిన్ను

కరగి పోయిన క్షణములు తిరిగిరావు
చెదరి పోయిన మణులకై వెదుకలేవు
నిష్ప్రయోజన మే సుమీ! నీ ప్రయాస
తెగి తునుకలైన సరము సంధింపలేవు

కాలయోషా విషాదాశ్రు కణము నీవు
మూర్తి గొన్నట్టి చీకటి ముద్దవీవు
పగిలి పోయిన హృదయ దర్పణమునందు
నీ స్వరూపము నిక కాంచ నేంవోయి!



# మత్కుణ శయ్య

అంధతమో నిశీథిలో ఆదమరచి
హాయిగ నిదురించు నన్ను ఆవరించి
నల్లుల్లా కుట్టి మేలు కొల్పుతారు
కళ్లు విప్పిచూస్తే కనిపించ బోరు

ఎవరు మీరు! ఎవరు మీరు! ఎవరు మీరు!
ఎలుగెత్తి పిలిస్తే వినిపించుకోరు
మేలుకున్న వాడికిచట మేలులేదు
ఏ ప్రశ్నకుగాని ఇట జవాబురాదు

అన్నీ పెకలించి వేసిన పునాదులు
నిశ్శబ్దత నిండిన జీవసమాధులు
నిట్టూర్పులు విడుస్తున్న నిశాచరులు
తీరని కోరికల తిరుగు పిశాచాలు

ఇరులు వెలుగు ఏకమైన వింతరాత్రి
నాగరికత చెదపట్టిన భూతధాత్రి
నా మనస్సు వ్యథాకులిత మౌతున్నది
నా కన్నులు నేలకొరిగి పోతున్నవి

ఈ లోకం నన్ను నిదుర పోనివ్వదు
ఈ లోకం నన్ను మేలు కోనివ్వదు
రెండిటికీ పధ్యచెడిన రేవడినై
భ్రష్టుడినై...భ్రష్టుడినై...భ్రష్టుడినై



# ఏకాంత గీతి

పూవుల తావులు [తావి మత్తుగొని
సమీర వీచులు సాగినవేళ
అపర శిఖరి అరుణారుణ బింబము
స్వర్ణకాంతి పై జల్లెడువేళ

ఎవ్వరు చూడని ఏకాంతములో
సడి వినిపించని సాయంత్రములో
వ్రాసితి నీ వారాశి తీరమున,
పెదవులు దాటని ఎదలో దాగని
నీదు రసాకృతి నించిన నాకృతి
నా జీవన వీణా మధురశ్రుతి

ఏ తుఫాను రేగినదో కడలిని
చెలరేగెను వీచిక లువ్వెత్తున
చెరగి పోయినది విరచిత గీతిక
ప్రీలి పోయినది వీణా తంత్రిక

మసక చీకటులు దెసల క్రమ్మినవి
చుక్కలే పొడిచి వెక్కిరించినవి
ఎందుకు వచ్చితి ఏమిటి తెచ్చితి
నే నెవరని నన్నే ప్రశ్నించితి
నేనే నీవని నీవే నేనని,
వినిపించిన దొక విచిత్ర కంఠము

రవి చంద్రులు తారలు కనజాలని
ఆ మధుగీతము ఆ సంగీతము
నా హృదయ స్పందనలో దాచితి
నా మానస క్రందనలో నించితి—



# బాల్యం

ఈ చీకటి తెరలు చీల్చి ఎలా చూడగలను నిన్ను
ఈ మంచు ఎడారి దాటి ఎలాచేరగలను నిన్ను!
ఈ హృదయ స్పందనతో గీత మెలా నింపగలను!
అశ్రువు లక్షరములుగా ఎలా అనువదింప గలను!

జీవిత వర్షానికి నీ వే మధుర వసంతానివి!
సుగంధాని లాలు వీచు ఆనందవి భాతానివి!
ఏ బంగరు రెక్కలలో ఎగసి వచ్చినావు నీవు
మరపురాని బాల్యం! నీ వెలా కరగి పోయినావు

నా దెంతటి శక్తి ఉభయ సంధ్యలనే సంధింపగ
నే నెంతటి వాడ జగత్ సృష్టిని వ్యాఖ్యానింపగ
ఋతు రథ చక్రాలక్రింద తల వంచిన విశ్వసృష్టి
కనులనుండి కురుస్తూంది దుర్భర బాధాశ్రువృష్టి

చిరుగాలులు సోకినంత కిల కిల మని నవ్వినాను
పూవులు వికసించి నంత పొంగి పులకరించి నాను
తారా కాంతులు నా కన్నులలో ప్రతి బింబించెను
రెక్కలు విప్పిన గువ్వలు గా కోర్కెలు విహరించెను

కొండలు కోనలు వనాలు పచ్చని పంటల పొలాలు
ఎండలు వానలు సంధ్యలు సాగర సికతా స్థలాలు
నిగనిగలాడే అనంత నీలా కాశపు పందిరి
కన్నుల విందై మురిపించే ఇంద్ర ధనుస్సుందరి

దృశ్యమాన సౌందర్య ప్రకృతి నన్ను మురిపిస్తే
తియ తీయని తెలియని సంగీతం మై మరపిస్తే
ఆనందోన్మత్తుడనై ఆడిన పాడిన దినాలు
తావులీను స్వర్ణధూళిలో పొరలాడిన క్షణాలు —

మనిషి మనిషి మధ్యముళ్ల తీగెలు చిగురిస్తాయని
మనిషి మనసు దారుల విషనాగులు విహరిస్తాయని
తనకేవీ అందవనీ తనకేవీ చెందవనీ
ఏమీ ఎరుగదు పాపం! ఆ బాల్య క్రీడావని—

ఊహించిన దంతా ఒక ఉన్మాది మతి భ్రమగా
చేసినదీ చేస్తున్నది అర్థరహితమౌ శ్రమగా
కనిపించని కత్తిపోట్లతో జీవిత మొకశాపం
ఈ లోకం ఊరించే ఆరని ఆశా దీపం

హృదయం మరణిస్తున్నది మానవత నశిస్తున్నది
ఈ జీవచ్ఛవమునపై శాచికత హసిస్తున్నది
ఉన్నత శృంగాల జనించిన జీవన భాగీరథి
ఏ తెలియని గమ్యానికొ అధః పతన మౌతున్నది

గుండ్రని ధాత్రీ గోళము ముక్కలు ముక్కలుగ చేసి
దిశలు నిర్ణయించి భిన్న భిన్న మార్గములనుతీసి
ముందే పుట్టిన అన్నలు మోసగింతురని తెలియదు
కనిపించని శృంఖలాలు కట్టి వేయునని తెలియదు

ప్రేమలు బాధలు భయాలు నవ్వులు ఏడ్పులు సుఖాలు
స్నేహితాలు కుత్సితాలు విచికిత్సలు వియోగాలు
ఎదలో దావానలాలు మదిలో ఝుం ఝూనిలాలు
అనుక్షణం వినిపించే మృత్యుదేవి పద ధ్వనులు

శవాలు కాలే వాసన, పురిటింట్లో కేరింతలు
ఎదలోపలి ఎదలోపల ఏవో చక్కిలిగింతలు
దిశలులేని తావున దిక్సూచి కర్థమే కానక
కాల మహాంబుధిలో చుక్కాని కర్థమే కానక

నలువైపుల ఆవరించు అంధ తమస్సులను గ్రోలి
వాడినకోర్కెల పూవుల స్వప్న శయ్య పైనితూలి
దర్పణ శకలాలలోన నా రూపును పోల్చుకొందు
మరపురాని శైశవమును మరల మరల పిల్చుకొందు



# సంధ్యారాధన

ఏ మధుర స్మిత
భిక్ష కోసమో
ఈ జీవన పాత్ర వహించితి—

ఏ కరుణా లో
కన కాంతులకో
ఈ యాత్రను కొనసాగించితి—

ఏ సంగీతా
నిల స్పర్శకో
సవరించితి హృదయ విపంచిక—

ఏ స్నేహామృత
ధారల కోసమొ
వెలిగించితి ఆశాదీపిక—

*    *    *

ఔనా, ఇది తీ
రని అ వేదన
ఔనా ఇది తీయని సాధన—

ఆశ నిరాశల
చీకటి వెలుగుల
ఔనేమో సంధ్యారాధన!—



# ఏకాంత తార

నిద్రా ముద్రిత నిశీథి బడిలో
ఒగరుస్తున్నది ఒంటరి తారక
చీకటి కుటిలో చెదరిన హృదిలో
విలపిస్తున్నది వీడని కోరిక—

గువ్వలు గూడుల కూరుకు చెందెను
కడలి కెరటముల కలలు వరించెను
ఆకల్లాడదు అణువు చలింపదు
జగమంతా నిశ్శబ్దత నిండెను—

పాల వెన్నెలలు పరచిన వేళ
పూల వాసనలు పొంగినవేళ
విశ్వ గాయకుని వేణు నిస్వనపు
జోలలో సృష్టి సోలినవేళ—

నిద్దుర మైకపు నిశిలో తారక
కనుల అశ్రు జలధార
చీకటి ముసిరిన శిథిలాలయమున
భగ్న జీవన సితార...



# ఇసుక దీవి

ఈ చెలరేగు తుఫానుల
ఈ మూగే ఉల్బణాల
ఎటకు సాగునీ సయనము
ఈ క్షుభితార్ణో రాశిని——

కనిపించే ఇసుకదీవి
కలగాదని భావించితి
అదే గమ్యమని తలచితి
అదే తీరమని సాగితి

మనసే మత్తిల్లి పోయె
మమతా మధువే స్రవించి
అహర్నిశలు పయనించితి
ఆశా నౌకను వహించి

అశ్రు తరంగాలలో జ
లావర్తము లెన్నొ గడచి
ఆ సుఖజీవన తీరమె
ఆశించితి శ్రమను మరచి

శాంతి లేని బ్రతుకున వి
శ్రాంతి యేని దొరకదాయె
కనిపించిన ఇసుకదీవి
కనుల ముందు కరగి పోయె



# దేనికో ....

దావానలం రేగి ఝుంఝూనిలం మూగి
దగ్ధమై నీరవత ఆవరించిన వేళ
జీవితోద్యానపు చితా భస్మరాశిలో
దేనికో నా కనులు దేవులాడేను...

అశని పాతాలతో ఫెళ ఫెళార్భటులతో
ప్రళయ భీకర వృష్టి అలసి పోయిన వేళ
నిద్రాణ మానసా కాశ నీలిమలోన
దేనికో నా కనులు దేవులాడేను...

పొరలు కన్నీళ్లలో పొంగు వెక్కిళ్లలో
మాతృహీన అనాథ శిశువు వలె రోదించి
సొమ్మసిల్లిన మూగ గుండె చప్పుడులలో
దేనికో నా కనులు దేవులాడేను...



౫౦

# అమాస చీకటి

నిరాశ...కన్నుల
అమాస చీకటి
తీరని కోరిక
ఆరిన దీపిక

నదింప లేదిక
స్వరాల గీతిక
తెగింది జీవన
వీణా తంత్రిక

జ్వలించు ఎదపై
జగాన కురియదు
ప్రశాంతి నిడు కరు
ణా నీహారిక

భరింప జాలని
వ్యథా నిశీథిని
సుఖాల చాందిని
వరించు నా ఇక!

పథమ్ముకై చూపగ
ఎదో విన్పింపగ
వినీ లాభ్రమున
తపించు తారక

నిరాశ...కన్నుల
అమాస చీకటి
ఎదలో కోరిక
జ్వలిత జ్వాలిక



# ఖేదాంతం

పదనేస్తం తలవంచుకు వెళిపోదాం
ఏ వేవో ఊహిస్తాం అంతా మన చాదస్తం
లోకపు కీకారణ్యంలో నడుస్తున్న
చీకటి బాటసారులం మనం
దారి ఎలావుంటేనేం గాలి ఎలా వీస్తేనేం
నడిచిపోక తప్పదు మరి ఏంచేస్తాం

లోకులు మనబుజాల కెత్తిన బరువులు
కాల పురుషుని నిశీధాల అడుగులు
మోయలేక మనగుండెలు మూలుగుతున్నా
దారి పొడుగున గుండెనెత్తురు లొలుకుతున్నా
ఆశల ఊత కర్రలతో మరికొంచెం దూరం నడుద్దాం
శ్రమించడం భ్రమించడం అంతే మనజీవితాల కర్థం

మంచులా ఘనీభవించిన
మనజీవన కాసారాలు
అంధుడి కళ్లకు మల్లే
ఆశలు కోల్పోయి నాయి
జీవన కల్లోలిని పై కట్టుకున్న విశ్వాసపు వంతెన
అడుగడుగునా కంపిస్తూనే వుంది

దూరంగా కనిపించే కాంతి దీపాలు
మనల్ని భ్రమపెట్టే కొరివి దయ్యాలు—

అందని ఆ కాశంలో
సింగారించిన తారలు
వెలుగు నివ్వలేకున్నా
వెక్కిరించడం మానవు—

వేదాంతాల ధర్మాసుపత్రుల్లో
వాంఛాకేశాలు నెరసిన వైద్యులు
ఓపిగ్గా పోస్తున్న రంగునీళ్లు
కడుపులో త్రిప్పుతున్నాయి
గుండె దడ అధికమైంది

శతాబ్దాలుగా పేరుకున్న
అబద్ధాల పుట్టలో
నిజం వాల్మీకి తపోముద్రలో ఉన్నాడో
దీర్ఘ నిద్రలో ఉన్నాడో! ఎవడికి తెలుసు?

యుగ యుగాలుగా పేరుకున్న
అజ్ఞాన సాంద్ర జీమూతాల మాటున
సూర్యుడనే వాడొక డున్నాడో లేడో
చూచిందెవరు?

పదనేస్తం—తలవంచుకు వెళిపోదాం
దారి ఎలా వుంటేనేం— గాలి ఎలా వీస్తేనేం—
నడచి పోక తప్పదు మరి ఏం చేస్తాం—



౬౪

# పునర్భవ

ఎన్ని పూవులు రాలి పోలేదు!
ఎన్ని తీవలు వాడి పోలేదు!
ఈ వసంతోద్యాన వాటిలో
దరహాస పరిమళాలను నించి—

ఎన్ని ఉల్కలు తూలి పోలేదు!
ఎన్ని తారలు మాసి పోలేదు!
ఆ వినీలాకాశ వీథిలో
దివ్య తిర్విళకలై దీపించి—

ఎన్ని జాడలు చెరగిపోలేదు!
ఎన్ని దారులు మాసి పోలేదు!
తుదిలేని కాలపు ఎడారిలో
అజ్ఞాత గమ్యాల నాశించి—

ఎన్ని ఉప్పెన లెగసి పోలేదు!
ఎన్ని దీవులు కరగి పోలేదు!
ఈ అపార సముద్రగర్భాన
భయ విస్మయాల రేకెత్తించి—

ఎన్ని మమతలు మండి పోలేదు!
ఎన్ని ఆశలు ఎండి పోలేదు!
ఈ హృదంతర సీమలో-మధుర
మధుర రసవాహినుల నూరించి—



# ప్రవల్లిక

ఆ పూల తోటలో అరుణోదయాన
అందాల విరిబాల అరవిచ్చి నవ్వె

ఎందరో దాని దర్శింప వచ్చేరు
అందరూ దాని సోయగము మెచ్చేరు
కాముకులు, సౌందర్య ప్రేమికులు చేరి
సుందర ప్రసూనమ్ము చుట్టు తిరిగేరు

కవిరాయడొకడు చక్కని గీతి వ్రాసె
చిత్ర కారకుడొకడు చిత్రము లిఖించె
ప్రజయెల్ల దానిగని పలు పలు విధాల
వర్ణించినారు ఆ కర్ణించినారు

ప్రొద్దెక్కినంత సంపుల్లమై పోయి
ఆ పూవు క్రొంగ్రొత్త అందాలు చిందె
ప్రజల వింతైన కోలాహలము రేగె
ఆ పూలతోట అంతట మారు మ్రోగె

కంటికే కనరాని గాలి సంచారి
పరిమళాల్ దోచుకుని పారి పోయేడు
హృదయమేలేని తుమ్మెద ద్రిమ్మరీడు
మధువులను కొల్లగొని మాయ మయ్యేడు

ఆ పూలతోటలో ఆ సాంధ్యవేళ
వికృతమై వసినాది విరినేలరాలె—



౫౦

# ఎప్పటిలాగే

ఎప్పటి లాగే సూర్యుడు ఉదయిస్తున్నాడు
మానవు డెప్పటిలాగే పయనిస్తున్నాడు
ఎప్పటిలా భూగోళం పరిభ్రమిస్తోంది
గిర గిర మని ఋతుచక్రం తిరుగుతునే వుంది

మృతదేహాల పల్లకీలు వెళిపోతున్నాయి
పసి పాపల కేరింతలు వినిపిస్తున్నాయి
దరిద్రులూ ప్రేమికులూ విలపిస్తున్నారు
వింత వింత రాగాలను వినిపిస్తున్నారు
ఎప్పటిలాగే సూర్యుడు ఉదయిస్తున్నాడు

దారి తప్పినట్టి వాళ్లు తిరిగి చేరలేదు
గోతుల దిగబడిన వాళ్లు ఉబికి లేవలేదు
వెనుకే చిక్కి పోయినారు వెనుక బడిన వాళ్లు
సుస్థిరమై పోయినాయి కొన్ని మైలు రాళ్లు
ఎప్పటిలాగే సూర్యుడు ఉదయిస్తున్నాడు

శంకాకుల మనస్కులను శంక వీడలేదు
చింతావృత చిత్తాలను చింత వీడలేదు
వ్యాధి నయం కాకున్నా మందు మానలేదు
బ్రదుకు రోత పుడుతున్నా జనం చావలేదు
ఎప్పటిలాగే సూర్యుడు ఉదయిస్తున్నాడు

ఇంకా మృద్దీపికలను వెలిగిస్తున్నారు
జన వాహిని తమదారుల మరలిస్తున్నారు
సత్యం కోసం శోధన జరుగుతునే వుంది
శాంతి కొరకు జగమంతా అలజడి పడుతోంది.
ఎప్పటిలాగే సూర్యుడు ఉదయిస్తున్నాడు

నాగరికత శిఖరమెక్కి కొందరేడుస్తారు
ఎక్కలేక కొందరు కన్నీరు నించుతారు
ఎగ్రబాకే వారికన్న దిగజారే వాళ్ల
అంచనాల కందకుండ అగుపిస్తున్నారు
ఎప్పటిలాగే సూర్యుడు ఉదయిస్తున్నాడు

మనిషికి తెలియనిది లేదు తెలిసినదీ లేదు
మనిషి చెప్పినదీలేదు చెప్పనదీలేదు
ఏమైనా చేయగలడు ఏమి చేయలేడు
జగత్తులో చిత్రమైన వస్తువు మానవుడు
ఎప్పటిలాగే సూర్యుడు ఉదయిస్తున్నాడు

హృదయం మరణిస్తున్నది మనసు మేలుకొంది
స్వార్థం ద్రోహపు జిహ్వాల సాచిరగులుతోంది
భీభత్స రవాల విశ్వవీణ మ్రోగుతోంది
తెలియని ఏ దెసకొ కాల రథం సాగుతోంది
ఎప్పటిలాగే సూర్యుడు ఉదయిస్తున్నాడు
మానవుదెప్పటి లాగే పయనిస్తున్నాడు



# పిచ్చిగీతలు

పాదరసంలా జారి పోతున్నది మనస్సు
చేతి కందని కిర్మీర సుందరి ఇంద్ర ధనుస్సు;
ఎలా పట్టుకోవడం చెదరిపోతున్న కిరణాల్ని
వల త్రెంచుకుని ఎగిసి పోతున్న పావురాల్ని

విశ్వాసం మీద విశ్వాసం దిగజారి పోయింది
ఆశను చూచి ఆశబెదిరి పారి పోయింది
అగాధ శూన్యంలో జీవితం నిరాధార సేతువు
వెదక్కు హేతువు—నెత్తిమీద గూడు కట్టుకుంది తీతువు

ఏదీ వస్తున్నట్లు ముందుగా చెప్పదు
ఏడాదిలో ఓ వర్షర్తువు తప్పదు
మనిషిని ఎగిరి పోనివ్వదు భూమ్యాకర్షణ శక్తి
కత్తుల బోనులో ఉన్నా చావనివ్వదు జీవితంపై అనురక్తి

హృదయం మేధ కలియని ధ్రువాలు
జీవిత రథాన్ని చెరోదారి లాగే వారువాలు
వినిపిస్తుంది ఇప్పుడు మృత్యుపదాల చప్పుడు
కనిపించే దంతా మనదే ఒకప్పుడు

తీరమేదో గమ్యమేదో ఎవరికి తెలుసు!
మది ఎందుకు బాధిస్తున్నట్లు కంటిలో నలుసు
భూగోళం తిరుగుతుంది: బుర్రతిరుగుతుంది
మంచు గడ్డలో లక్ష్యం కన్నులలో కరుగు తూంది



# విశ్వ సమాధి

ఇపుడు ధరా గోళమే హ
ఠాత్తుగ స్తంభించి పోయె
ఇపుడు కాల వాహినియే
నిర్వేర వడి నిల్చిపోయె
ఏ యుగాల విప్రలంభ
మో యిప్పుడు ముగిసి పోయె
ఏ ప్రగాఢ పరీరంభ
మో సృష్టిని బిగిసి పోయె—

ఆశాంతము లావరించి
మరులు గొల్పు ఇరులలోన
సంధ్యాంగన కొప్పు వీడి
జారి పడిన కురులలోన
మౌన ముఖం దాచుకుంది
మంత్రించిన రీతి జగతి
లాహిరిలో తేలి పోయె
అఖిల చరాచర ప్రకృతి—

భూత పంచకము నివ్వెర
పోయినట్లు నిలిచిపోయె
భైరవ స్వరాల నీను
భువన వీణ మూగవోయె
రేగి పడే ఉత్కలికో
ర్మికల మూగె గాఢ నిద్ర
కల్లోల మహా పయోధి
లో ప్రశాంత మౌన ముద్ర—

ఇది తలంపులే కనుమో
డ్చిన తంద్రాలస నిశీధి
ఇది జగతీ నిర్వికల్ప
నిశ్శబ్ద మహా సమాధి
ఖగోళాన వెలిగించిన
కాంతి కాగడాలు లేవు
శూన్యనభోంత రాలలో
చుక్కల ప్రేక్షకులు లేరు —

మానవ మేధోంతర వి
జ్ఞాన దీప మారి పోయె
కళలన్నీ కరగి పోయి
చరిత్రయే మాసి పోయె
ఇకలేదు ఉషః ప్రసక్తి
ఇది అనంత చరమ రాత్రి
తెర జారిన నాటక రం
గ స్థలమీ స్తబ్ధధాత్రి—

ఏ బాధ్యత లే బరువులు
ఏ కర్తవ్యాలు లేవు
రగిలి రగిలి హృది జ్వలించు
ఏ భావన లెగసి రావు
శయనింపవె నామన
స్వఖీః ఇది విరామ వేళ
ఇది ప్రశాంత మహా ప్రళయ
హేల....................



# గీతిక

తనువంతా కన్నులుగా
జగమంతా వెన్నెలుగా
బ్రదుకంతా నిరీక్షించి
జరాభారమున కృశించి

నిరాశలో పిపాసలో
నేలకొరిగి పోయినపుడు
జీవన రజనీ ముఖాన
రాగకాంతి చెరగి నపుడు

*   *   *

తీగె తెగిన మూగ వడిన
ఈ విపంచి స్పృశియింపకు
నిదురించు కుహూ తమస్వి
నీ హృదిలో మెరపించకు —



# తుఫాను రాత్రి

జీవితం పరుగెడుతోంది
వార్షుకమేఘాచ్ఛాదిత గగనం
కుంభవృష్టి కురుస్తోంది

భయావహమైన దురంతమైన తుఫాను రాత్రి
కలియని పట్టాల మీద
కదలి పోతోంది జీవితం రైలుబండి

నిప్పు రవ్వలు చిమ్ముకుంటూ
నిట్టూర్పుల పొగలు విడుస్తూ
దూరాన్ని దహిస్తూ
భారాన్ని వహిస్తూ
ముందుకే ముమ్ముందుకే సాగి పోతూవుంది

పట్టణాలు జనపదాలు
ఎడారులు నదీ నదాలు
అరణ్యాలు మైదానాలు దాటుకుంటూ
చీకట్లో దూసుకు పోతూనే వుంది

ఎన్నెన్ని కరగి పోతున్న దృశ్యాల చెరగిపోని వర్ణాలు!
ఎన్ని మెరపుల మరకలు!!
మనో వీధిలో మాసిన ఆశారేఖలు
నిశీథిలో నిదురవోవు కాలిదారులు
ఊరకే వెనక్కి తిరిగి చూస్తుంది పిచ్చి మనస్సు

వెలిగీ వెలగని గుడ్డి దీపాలు
చలి పుట్టించే శీతల పవనాలు
ఏవో మృత్యు రహోగానాలు
ఏవేవో అగోచరాహ్వానాలు

అన్నిటినీ కప్పుతున్న తెలియని చీకటి పొరలు—
గమ్యం చేరు వౌతున్నది
గమన వేగం హెచ్చుతున్నది
తెలవారకముందే స్టేషన్ వచ్చేస్తుందా!
చీకట్లోనే వాలిపోతుందా సిగ్నల్ రెక్క



